# నాటకకథావాచకము

## మొదటితరగతి.

[illegible] [illegible]

[illegible] [illegible].

[illegible] పంతులు, బి. ఏ., ఎల్. టి.,

[illegible].



[illegible] :

వేంకట్రామ్ అండ్ కో.,

హెడ్డాఫీసు:—ఏలూరు.

రామా పవర్ ప్రెస్, ఏలూరు.

1932.

 [వెల 0—2—0

# విషయసూచిక.







# నాటకకథావాచకము

మొదటి తరగతి.

## 1. కాకి - నక్క.



1. కాకి.

ఒక కాకి మాంసపుముక్కను నోటఁ గఱచికొని వచ్చెను. అది యొక చెట్టుకొమ్మమీఁదఁ గూర్చుండెను. ఆమాంసపు ముక్కను ఒకనక్క చూచెను. నక్క దానిఁ గోరియుండెను. కాకిని మోసపుచ్చి, మాంసపు ముక్కను దొంగిలింపవలెనని నక్క తలంచెను.

"ఓ, కాకిబావా ! నీ పాటను విని చాల కాలమైనది. నీ కంఠము చాల యింపుగా నుండును. ఒక్క పాటను పాడుము. విని సంతోషించెదను" అని నక్క పొగడెను. కాకి దాని మాటలకు ఉబ్బెను. 'కా—కా' అని యఱచెను. మాంసపు ముక్క క్రిందఁబడిపోయెను. ఆ ముక్కను నక్క యెత్తుకొని పాఱిపోయెను.

### 2. ప్రశ్నలు.

1. కాకినోట నేమియుండెను ?
2. దానినిఁ జూచి నక్క యేమనుకొనెను ?
3. కాకిని నక్క యేమని యడిగెను ?
4. కాకి పాడినపుడు మాంసపుముక్క యేమాయెను?
5. మాంసము క్రిందఁబడినపుడు నక్క యేమిచేసెను ?

### 3. సామెతలు.

1. కాకిచూపు:-కాకి చాల దూరమువఱకుఁ జూడగలదు.
2. నక్కజిత్తులు:-నక్క ఉపాయము గలదని వాడుక.

### 4. వ్రాయుండు.

1. కాకి ముక్కు. 2. చెట్టుకొమ్మ. 3. నక్కతోక.





### 5. చేతిపని.

1. కాకి ఈకె:- పుల్లతోఁగాని, పెచుతోఁగాని, కాగితముతోఁగాని.
2. కాకిముక్కు:— అట్టతోఁ గత్తిరించుట.

### 6. వస్తుపాఠము.

నక్క పొలములలో దిరుగును. భూమిలోఁ గన్నము చేసికొని యుండును. రాత్రివేళ కూయును. ఊరిలోనికివచ్చి కోళ్ళనెత్తికొని పోవును. నక్క మాంసమును దినును. ఇది కొంచెమునకు కుక్కను బోలియుండును. దీనితోఁక కుచ్చువలె నుండును.

కాకి ఊరిలో నుండు పక్షి. దీని ముక్కు గట్టిగా నుండును. ఇండ్లచుట్టును దిరుగుచుండును. మెతుకులను, గింజలను దినుచుండును. ఇది చెట్లమీఁద గూండ్లుకట్టుకొనును. రాత్రివేళ గూటిలో నిద్రించును. తెల్లవారఁగనే లేచి కూయును. కాకులు కూసినపుడు తెల్లవారెనని మనకు గుఱుతు.

### 7. నాటకము.

నక్క:— నేను వనములో మాడుచున్నాను. ఎక్కడ తిరిగినను తిండికేమియు దొరుకలేదు. (పైకి చూచి)

తే. గీ. కాకి అదిగో! మాంసపుముక్క కలదు నోట
దగ్గఱకుఁ జేరరానిమ్ము దాని నిపుడు
మోసమునుజేసి మాంసంబు గొనికొనెద
హెచ్చు పొగడిన నుబ్బును పిచ్చి కాకి.

ఆ! మేలు. వచ్చి యీచెట్టుమీఁదనే వ్రాలినది.

కాకి:—(తనలో) నక్క చెట్టుక్రిందఁ గూర్చున్నది. నావంక నే చూచుచున్నది.

నక్క:—కాకిబావా! నిన్నుఁజూచి ఎంతకాలమైనది!

తే. గీ. బాగుగాఁ బాడఁగలవు నీపాట వినఁగఁ
గోరి యిచ్చటఁ గూర్చుంటిఁ గొంచెమైన
పాట వినుపింపు మిప్పుడు బావ! నేను
మనసు సంతోషపడునట్లు వినెద దాని.

కాకి:—(తనలో) పాపము! నక్క మంచిది. నాకోసము వచ్చినది. నాపాటలను వినుపించెదను. (కా-కా-యని కూయును.) అయ్యో! నానోటిలోని మాంసపు ముక్క క్రిందఁ బడిపోయినది.

నక్క:—(తనలో) కావలసినపని యైనది. మాంసపు ముక్క దొరికినది. దీనిని నోట గఱచికొని పోయెదను. (మాంసమును ఎత్తికొని పోవును.)

కాకి:—అయ్యో! ఎంతమోసపోతిని! మాంసమును గష్ట పడి తెచ్చికొంటిని. తినుటకు ప్రాప్తిలేకపోయెను.

ద్విపద. ఒరుల పొగడ్తకు గరువింపరాదు.
గరువించి కోల్పోతిఁగాదె మాంసమును.

8. కీర్తన.

ఒరులు నిన్నుఁ బొగడఁగానె యుబ్బిపోకు మెప్పుడున్
బరుల మాటలందు నిజము నెఱిఁగి తిరుగఁగావలెన్॥

తెలివిలేని కాకి వెదకి తెచ్చికొన్న మాంసమున్
సులువుగాను నక్కమంచి పలుకులాడి పొందదే ॥౭॥

## 9. లెక్కలు.

1. ఒక నక్కకును ఒక కాకికినిఁ గలిసి యెన్ని కాళ్లు?
2. కాకికంటె నక్కకు ఎన్ని కాళ్లు ఎక్కువ?
3. రెండుకాకుల కెన్ని కాళ్లు?
4. నక్కకాలు ఒకటి విఱిగినది. ఇఁక నెన్ని కాళ్ళతో నడుచును?

# 2. సింహము - చిట్టెలుక.





### 1. కథ.

ఒక సింహము నిద్రపోవుచుండెను. ఒక చిట్టెలుక దాని పై కెక్కి యాట లాడు చుండెను. సింహము మేలుకొనెను. సింహము లేచి యెలుకను బట్టుకొనెను.

చిట్టెలుక వణకుచు నన్ను విడిచి పెట్టుము. 'నీకు మేలు చేయుదును' అనెను. "నీవు నాకేమి మేలు చేయఁగలవు?" అని నవ్వి, సింహముదానిని విడిచిపెట్టెను.

కొన్నినాళ్ళకు సింహము వలలోఁ జిక్కుకొనెను. వల నుండి తప్పించుకొనలేకపోయెను. సింహముగర్జించెను. సింహపు కేక చిట్టెలుక వినెను. విని పరుగెత్తికొని వచ్చెను. వలత్రాళ్లు

కొట్టికివేసెను. సింహము వలఁ దప్పించుకొని వెళ్ళిపోయెను.

### 2 ప్రశ్నలు.

1. సింహము ఏమిచేయుచుండెను ?
2. చిట్టెలుక సింహము నేమిచేసెను ?
3. సింహము లేచి ఏమిచేసెను ?
4. సింహమును చిట్టెలుక యేమని వేఁడెను ?
5. సింహము చిట్టెలుక నేమిచేసెను ?
6. సింహమున కేమి కీడు కలిగెను ?
7. చిట్టెలుక వలను ఏమిచేసెను ?
8. సింహము ఏమైనది ?

### 3. సామెతలు.

1. సింహబలము:—సింహము మిక్కిలి బలమైన జంతువు. మృగరాజు.
2. ఎలుకపన్ను:—పదునుగ నుండును.

### 4. వ్రాయుఁడు.

1. ఎలుకతోఁక. 2. వల. 3. సింహముతోఁక.



### 5. చేతిపని.

1. వల:—దారముతోఁ జేయబడెను.
2. ఎలుకతోఁక:—మట్టితోఁ జేయబడెను.

3. సింహముతోఁక:—పుల్లలతోను కాగితముతోను జేయవలెను.

6. వస్తుపాఠము.

1. సింహము అడవులలో నుండును. దీనిని సర్కసు కంపెనీలవారు బోనులలో నుంచుదురు. ఇది జంతువులన్నిటిలో బలమైనది. దీని నడుము చాల సన్నము. మగసింగమునకు మెడమీఁద జూలుండును. సింహము భయంకరమైనది. ఇది గర్జించును. సింహము మృగములన్నిటికిని రాజు.

2. ఎలుక గింజలను దినును. ఇది కన్నములను ద్రవ్వి అందులో నుండును. ఇండ్లకప్పులలోఁ దిరుగుచుండును. ఎలుక బట్టలను, పుస్తకములను కొట్టివేయును. దీనిపన్ను కఱకుగా నుండును. వేగముగాఁ బరుగెత్తఁ గలదు.

7. నాటకము.

సింహము:-అబ్బా! చాలబడలికగానున్నది. ఇక్కడఁగొంచెముసేపు నిద్రపోయెదను.

చిట్టెలుక:-(వచ్చి) ఏమిది! ఇట్టి చక్కనివస్తువును నేనెప్పుడును చూడలేదు. దీనిపై కెక్కి ఆడుకొందును. మెత్తగానున్నది.

(సింహముపైఁ దిరుగును.)

సింహము:—(మేలుకొని) ఆ! ఏమి నీపొగరు! నామీదనే గంతులు వేయుచున్నావా? నీకుఁదగిన శాస్తిచేసెదను. చూడుము. (ఎలుకను బట్టుకొనును).

చిట్టె:—(గజగజ వణకుచు)

తే. గీ. వదలు నను జంప నీకేమి వచ్చునయ్య
చంపకుండిన నీకు నే సాయపడెద

సింహ:—(నవ్వుచు)

చిన్నదానవు నాకేమి చేయఁగలవు
విడచినాఁడను పొమ్మిఁక జడుపు లేక.

సింహ:—అయ్యో! వేటకాండ్రు వలలోఁ జిక్కితిని. వల చాల గట్టిగా నున్నది. త్రెంపఁజాలకున్నాను. ఇంక జావు నిజము.

తే. గీ. వలను జిక్కితి నన్నుఁ గాపాడుమయ్య!
శంకరా! నీవె నాకింక శరణమయ్య!
బలము చాలకయున్నది వలను ద్రెంపఁ
జావుఁ దప్పించి మృగరాజుఁ బ్రోవుమయ్య.

చిట్టె:—(వచ్చిచూచి) అయ్యో! పాపము! నన్ను ఈ సింహము మునుపు కాపాడినది. ఇప్పుడు వలలోఁ బడినది, నేను వలత్రాళ్ళను కొఱికివేసెదను. (వలను గొఱుకును.)

సింహ:—(బయటికివచ్చి) మిత్రమా! చిట్టెలుకా! నీవు నా ప్రాణములను నిలువఁబెట్టితివి. నీ మేలును మఱువఁ జాలను.

చిట్టె:—మునుపు నన్నుఁ జంపకుండ విడిచిపెట్టితివి. బ్రదికి యున్నాను. గనుక నిన్నుఁ గాపాడగలిగితిని.

సింహ:—ఇఁకమీఁద మనము స్నేహితులముగా నుందము. నా గుహకుఁ బోవుదము. రమ్ము. (ఇద్దఱును బోవుదురు.)

8. పద్యము.

ఎలుక:-1. పరుల కెగ్గుదలఁచ దగదు నే నుపుగలుగఁ జాలితేని
ఎలుకనైన సింగమునకు నే నుపుచేయఁదలఁచితి ।

2. కరుణతోడ సింగమిప్పుడు కాచివిడిచె నన్నుఁ దాఁ
గరుణతోడఁ గావకున్న మరణమొంది యుండనే ।

సింహ:-1. నేను గొప్పవాఁడననుచు నెంచరాదు గనుకనే
దాన హాని కలుగకుండ దప్పుకొంద నెప్పుడున్ ।

2. ఎన్నఁటికిని చిన్నవారి నిసడించరాదుగాఁ ।
చిన్నదైన యెలుక నాకుఁ జేసెనెంత సాయమున్ ?

9. లెక్కలు.

1. ఎలుకకుఁ గాళ్ళెన్ని ? రెండు ఎలుకల కెన్నికాళ్ళు ? రెండు సింహముల కెన్నికాళ్ళు ?

2. మూఁడుఎలుకల కెన్నితోఁకలు? ఎన్ని చెవులు?ఎన్నికాళ్లు ?

3. నాలుగు సింహముల కెన్నితలలు ?

4. దినమున కొక్కలేడిని సింహముతినును. వారమున కెన్నిటిని తినును ?

5. నిముసమునకొక త్రాటిని ఎలుక కొఱుకును. ఆఱుత్రాళ్ళను ఎన్ని నిమిషములకుఁ గొఱుకును?

6. నిముసములో ఎలుక రెండు గజములు పోవును. మూడు నిముసములలో ఎన్ని గజములు పోవును?

7. సింహము గడియకు మూడు క్రోసులు పరుగెత్తును? ఆఱు క్రోసులు ఎన్ని గడియలలో పరుగెత్తును?

---

# 3. చిఱుతపులి - కొంగ.



## 1. కథ.

ఒక చిఱుతపులి నోటిలో ఒక ఎముక గ్రుచ్చుకొనెను. చిఱుతపులి చాల బాధ పడుచుండెను. ఒక కొంగ చిఱుతపులి బాధను జూచెను. 'నీనోటిలోని యెముకను దీసెదను, నాకేమి

యిచ్చెదవు' అని కొంగ అడిగెను. 'శ్రేయము, గొప్ప బహుమాన మిచ్చెదను' అని పులి చెప్పెను.

పులి నోరు తెఱచెను. కొంగ మెడ పొడవైనది. మెడను పులినోటిలోఁ దోపెను. ముక్కుతో యెముకను బయటికి లాగెను. పులి చాల సంతోషించెను. కొంగ 'బహుమానము నిమ్ము' అని అడిగెను.

'నీ మెడను నా నోటిలోఁ బెట్టితివి. అప్పుడు కొఱికిన యెడలఁ జచ్చి పోవుదువు. కొఱుకకుండ నిన్ను బ్రతికించితిని. అదియే గొప్ప బహుమానము' అని చెప్పెను.

## 2. ప్రశ్నలు.

1. చిఱుతపులికి నోటిలో నేమి గుచ్చుకొనెను?
2. అందువలన దానికేమి కలిగినది?
3. కొంగ చిఱుతపులి కేమిచేసెను?
4. కొంగకేమియిచ్చెదనని పులిచెప్పినది?
5. తుదకేమి చెప్పెను?

## 3. సామెతలు.

1. కొంగమెడ పొడవైన మెడ.
2. కొంగకాళ్ళు సన్నని పొడవైన కాళ్ళు.
3. కొంగ జపము దొంగ వేసము.

### 4. డ్రాయింగు.

1. పులిగోరు. 2. కొంగ మెడ. 3. ఎముక.







### 5. చేతిపని.

1. ఎముక - మట్టితో. 2. కొంగ కాలు - పుల్లలతో.
3. పులిగోరు - కాగితముతో.

### 6. వస్తుపాఠము.

1. చిఱుతపులి అడవులలోను, పొదలలోను నుండును. కుక్కలను, కుందేళ్ళను, మేకలను బట్టుకొని తినును. ఇది పిల్లిని బోలియుండును. రాత్రులయందు ఆహారము కొఱకు దిరుగును. దీని ఒడలిమీఁద చాఱ లుండును. చూచుటకు భయంకరముగ నుండును.

2. కొంగ నీటి ఒడ్డున నుండును. చేఁపలను దినును. నీటియడుగున నుండు చేఁపలను బట్టుకొనగలదు. దీనిముక్కు మెడ పొడవుగనుండును. నీటిలో మెడవఱకు ముంచి చేఁపలను బట్టును. దీని కాళ్లు పొడవుగ నుండును. కొంచెము లోతు నీళ్ళలో నిలువఁ గలదు. దీని కన్నులు నీటిలోపలి చేఁపను జూడఁగలవు.

## 7. నాటకము.

చిఱుతపులి:—నా గొంతుకలోఁ జాలబాధగ నున్నది.

ఆ. వె. గ్రుక్కఁద్రిప్పకుండఁ గొఱికి మాంసంబును
నమలకుండ తింటి; నెముక యొకటి
గొంతులోనఁ గ్రుచ్చుకొనియెఁ దాళఁగఁజాల
బాధకింక; ఎముక వచ్చునెట్లు ?

కొంగ:—(ప్రవేశించి) ఓ చిఱుతపులీ ! నీ గొంతుకలో నొక యెముక గ్రుచ్చుకొన్నదని విన్నాను. చాల బాధ పడుచున్నావఁట.

చిఱుతపులి:—అవునమ్మా! నా బాధ దేవునకుఁ దెలియవలె. గొంతుకంతయు వాచినది.

కొంగ:—నా మెడ పొడవైనది. నీనోటిలోఁ దూర్చి యెముకను లాగెదను. నాకేమి బహుమాన మిచ్చెదవు ?

చిఱుతపులి:—గొప్ప బహుమతి నిచ్చెదను. తీయుము.

కొంగ:—(ముక్కుతో నెముకనులాగి) ఇదిగో! ఎంత యెముకయో చూడుము.

చిఱుత:—అమ్మయ్యా! నా బాధ గట్టెక్కినది. నీకుఁ జాల పుణ్యము వచ్చును.

కొంగ:—నాకు బహుమతిని యిమ్మా.

చిఱుత:—ఓకొంగా ! నీవు వెఱ్ఱిదానవు.

ఆ. వె. పాపపుగొలుసు నీదు కంఠము నా నోటిలోఁ
జిక్కినపుడు కొఱికివేయకుండ
బ్రతుకనిచ్చినాఁడ బహుమాన మిదె నీకు
వేఱె యడుగనేల? వెడలి పొమ్ము.

నీతి.

చెడ్డవారి కెపుడు మేలు చేయఁ బోకుము
చెడ్డవారు తిరిగి మేలు చేయఁదలఁపరు
చిఱుతపులికి కొంగ మేలుచేసి మున్ను తాఁ
దిరిగి పొందినట్టి మేలు తెలిసిపోయెఁగా ॥చెడ్డ॥

## 9. లెక్కలు.

1. ఒక పులిమీఁదఁ బది చాఱలుండును, రెండు పులుల కెన్ని చాఱలుండును?
2. నాలుగు కొంగల కెన్ని కాళ్లుండును?
3. ఒక కొంగ దినమునకు 8 చేఁపలను తినును. రెండు కొంగ లెన్నిఁటిని తినును?
4. కొంగ నిముసమునకు 4 గజము లెగురును. నాలుగు నిముసములలో నెన్ని గజములు పోవును?
5. పులి గంటకు అయిదు మైళ్ళు పఱుగెత్తును. పది మైళ్లు పోవుటకెన్ని గంటలు పట్టును?

# 4. తోఁడేలు - మేఁకపిల్ల.



**1.** కథ.

గొల్లవాని మందలో నొక మేఁకపిల్ల కలదు. తన యిష్టము వచ్చినట్లుగాఁ దిరుగఁదలఁచెను. "అమ్మా! నేను అడవినిఁ జూచివచ్చెద"నని తల్లిని అడిగెను. తల్లి "పోవద్దని" యెంతయో చెప్పెను. మేఁక పిల్ల తల్లిమాట వినలేదు. అడవికిఁ బోయెను. అచటఁ జాలసేపు తిరిగెను. దానికి దాహమైనది.

నీరుద్రావుట కొక యేటికిఁ బోయెను. అచ్చట నొక తోఁడేలుఉండెను. ఆ మేఁకపిల్లనుబట్టుకొనెను. "తల్లిమాట వినకుండ వచ్చితిని. అపాయము వచ్చినది." అని మేఁకపిల్ల విచారించెను, తోఁడేలు దానినిఁ జంపి తినివేసెను.

2. ప్రశ్నలు.

1. మేఁకపిల్ల ఎచ్చటనున్నది ?
2. దానికేమి బుద్ధిపుట్టినది ?
3. తల్లి ఏమి చెప్పినది ?
4. మేఁకపిల్ల ఏటికి ఎందుకుఁబోయెను ?
5. అచ్చట ఏమి జరిగినది ?
6. మేఁకపిల్ల ఏమని విచారపడెను ?

3. సామెతలు.

1. మేఁకపోతు గాంభీర్యము—పిఱికితనమును కలిగి యుండియు ధైర్యమును నటించుట.

4. డ్రాయింగు.

తోఁడేలు చెవి    మేఁకగిట్ట    మేఁకతోఁక







6. వస్తుపాఠము.

1. మేఁక సాధువైన జంతువు. మేఁకలను గొల్లవారు పెంచుదురు. ఇది అన్ని ఆకులను దినును. దీనిపాలు పథ్యము.

5. చేతిపని.

1. తోఁడేలుచెవి - అట్టతోఁ గత్తిరించవలెను.
2. మేఁకగిట్ట - మట్టితోఁ జేయవలెను.
3. మేఁకతోఁక - కాగితముతోఁ జేయవలెను.

నకు బనికివచ్చును. మేఁక కొండలపై కెక్కి మేతఁ మేయును. దీని తోఁక కుఱుచ. కాళ్ళుపొడవు. దీనికి సన్నని చీలిన గిట్ట లుండును.

2. తోఁడేలు క్రూరజంతువు. ఇది మేఁకపిల్లలను లేడి పిల్లలను చిన్న చిన్న జంతువులను జంపి తినును. ఇది గ్రామ ములలోఁ దిరుగదు. అడవులలోను పొలములలోను దిరుగును. ఇది ఆకారములో జాలవఱకు కుక్కను బోలియుండును.

7. నాటకము.

మేఁకపిల్ల:—అమ్మా!

ఆ. వె. అడవిలోన దిరిగి యాకలంబుల మేసి
నీరు ద్రావి యిల్లుఁ జేరకుండఁ
గొంకి కట్టఁబట్టి గొల్లండు మందలోఁ
దూఱునట్లు నన్నుఁ ద్రోలుచుండు.

తల్లి:—ఓసీ! నీవు పసిపిల్లవు. ఆసలకుఁ బోయిన యెడల ఆపద కలుగును. అందుచేత నిన్ను పోనియ్యకున్నాఁడు.

మేఁకపిల్ల:—అట్లుకాదు. ఈదినమున నేను అడవికిఁ బోయి మేసివచ్చెదను.

తల్లి:—వెళ్ళవద్దు. నీకుఁదెలియదు. అచ్చటఁ గ్రూరజంతువు లుండును. ఆపదను పొందెదవు. నామాట వినుము. వెళ్ళవద్దు.

మేఁకపిల్ల:- ఏమైనను సరే! నేను వెళ్ళకమానను. అడవినిఁ జూచి రావలయును. (అనిపోవును.)

తోఁడేలు:-(ప్రవేశించి) అదిగో! చక్కని మేఁకపిల్ల వచ్చి నది. దీనినిఁ జంపి తినెదను. నాకడుపు నిండఁగలదు.

మేఁకపిల్ల:-అయ్యో! అదిగో! తోఁడేలు వచ్చుచున్నది. నామీఁదఁ బడును కాఁబోలు!

ఆ-వె. అమ్మమాట వినక అడవికి వచ్చితి
నెవరు దిక్కునాకు నిపుడు ప్రోవ
దుమికి వచ్చుచుండెఁ దోఁడేలు నామీఁది
కెట్లు తప్పుకొందు నిచటినుండి.

తోఁడేలు:-(మేఁకపిల్లను జంపి) ఆహా! నేఁడు నాకుఁ గడుపు నిండ ఆహారము దొరకినది. చాల సంతోషముగా నున్నది.

8. కీర్తన.

పెద్దవారి మాటలన్ । వినక తిరుగు వారికిన్
ఎద్దియైన హానివచ్చు । నిక్కతప్పదెన్నఁడున్ ॥పెద్ద॥
తల్లిమాట వినక మేఁక । పిల్ల యడవి కేఁగి తోఁ
డేళ్ల వాతబడియెఁ దోఁటి । పిల్లలన్నియుండగాన్ ॥పెద్ద॥

9. లెక్కలు.

1. తోఁడేలునోటిలో ఆఱు పండ్లున్నవి. రెండు తోఁడేళ్ళ కెన్ని పండ్లుండును ?

2. తోఁడేలునకు నాలుగుకాళ్లు. కాలికి 'నాలుగు గోళ్ళు. మొత్తమెన్ని గోళ్ళు కలవు ?

3. మేఁకపిల్లకు తోఁడేలునకుఁ గలిసి యెన్ని కాళ్ళు ?

4. మేఁకపిల్ల కొక్క చెవి తెగిపోయినది. ఇంకెన్నియుండును ?

5. మేఁకకు నాలుగుపిల్లలుండెను. ఒక్క దానిని తోఁడేలు తినెను. ఒక్కటి పాఱిపోయినది. ఇంకెన్ని పిల్లలుండెను ?

---

# 5. పిల్లులు - రొట్టెముక్క.



## 1. కథ.

రెండు పిల్లులుకలిసియొకరొట్టెముక్కను దెచ్చికొనెను. దానిని సమముగాఁ బంచుకొనవలసి యుండెను. భాగములు

కుదరక పోట్లాడుకొనుచుండెను. అచ్చటనొకకోఁతి కన్పడెను. "రొట్టెముక్కను బంచిపెట్టు" మని కోఁతిని అడిగెను. ఆకోఁతి దానిని రెండు ముక్కలుగాఁ జేసెను. ఒక త్రాసులో రెండు వైపులను బెట్టెను. త్రాసులో నొకవైపు క్రిందికి దిగెను. ఆ వైపు ముక్కలో సగము కొఱికి తినివేసెను. రెండవవైపు క్రిందికి దిగెను. మఱల నిందులో సగము కొఱికి తినివేసెను. మొదటివైపు క్రిందికి దిగెను. ఇట్లు తూనిక కుదురకుండఁజేసి కోఁతి రొట్టెముక్క నంతయుఁ దినివేసెను. పిల్లులకు ఏమియు మిగులలేదు.

## 2. ప్రశ్నలు.

1. పిల్లులు దేనినిఁ దెచ్చికొనినవి ?
2. వానికి పోట్లాట యేల వచ్చినది ?
3. కోఁతిని యేమనికోరెను ?
4. కోఁతి యేమిచేసినది ?
5. తుదకు పిల్లులగతి యేమైనది ?

## 3. సామెతలు.

1. కోఁతి పంచాయతి:—అక్రమపు తీర్పు.
2. కోఁతి మొగమువాఁడు:—అందములేనివాఁడు.
3. పిల్లికి బిచ్చము పెట్టఁడు:—కొంచెమైనను దానము చేయఁడు.
4. కోతిచేష్టలు:—ఆకతాయిచేష్టలు.
5. పిల్లినడక:—చప్పుడు కాకుండ నడుచుట.

4. డ్రాయింగు.

1. త్రాసు. 2. కోఁతిచేయి. 3. పిల్లితోఁక.







5. చేతిపని.

1. త్రాసు:—కాగితముతోను పుల్లలతోను.

2. కోఁతిచేయి:—మట్టితో.

3. పిల్లితోఁక:—కాగితముతో.

6. వస్తుపాఠము.

1. పిల్లి మనయిండ్లలోఁ దిరుగు చుండు జంతువు. దీని కాళ్ళక్రింద మెత్తని దిండ్లుండును. పిల్లి నడచు నపుడు కొంచె మైనను చప్పుడుకాదు. ఇది చీకటిలో బాగుగాఁ జూడఁగలదు. దీనిగోళ్ళు పులిగోళ్ళవలె నుండును. వానిని లోనికి ముడిచి కొనఁగలదు.

పిల్లి యెలుకలను వేఁటాడును. అది మాంసము దినును. ఇంటిలోఁ దిరుగుచు మూఁతలు పడఁగొట్టి పాలు, మీఁగడఁ దినును. దీని కండ్లు పగలు పచ్చగా నుండును. రాత్రులందు నల్లగా నుండును.

2. కోఁతి వనములోఁ దిరుగు జంతువు. దీనికి మనుష్యులవలె కాళ్ళు చేతులు ఉండును. మొగము కూడ

కొంతవఱకు మనుష్యుని బోలియుండును. దీనికి తోఁకకలదు. కోఁతి చెట్లమీఁద పఱుగెత్తగలదు.

కోఁతి ఫలములనుతినును. పండ్లను మనుష్యులవలెఁజేతితో నొలిచి ముక్కలు చేసికొని నోటిలో వేసికొనును. ఇది బియ్యము, పప్పులు మొదలగునవి తినును. దీని మెడక్రింద రెండు తిత్తులుగలవు. ఆహారమును ఆతిత్తులలో నిలువఁబెట్టుకొనును. కోఁతి తన చిన్న పిల్లలను కడుపున కంటించుకొని పోవును.

## 7. నాటకము.

మొదటిపిల్లి:—రొట్టెముక్క నీ నోటిలోనే యుంచుకొంటివి. నాసగము నాకిచ్చివేయుము.

రెండవపిల్లి:—ఇందులోఁ గొంచెము నీకుకొంతయిచ్చెదనురమ్ము.

మొదటిపిల్లి:—అట్లు పనికిరాదు. సమానముగఁబంచి యివ్వవలెను.

రెండవపిల్లి:—తూఁచి పంచుట నాచేతగాదు.

మొదటిపిల్లి:—అదుగో! కోఁతి వచ్చుచున్నది. దానికి చేతులున్నవి త్రాసులోపెట్టి తూఁచి పంచి పెట్టఁగలదు. రొట్టెముక్కను కోసిచేతికిమ్ము.

రెండవపిల్లి:—ఓ కోఁతిబావా! మాకు ఈ రొట్టెముక్కను సమానముగాఁ బంచిపెట్టుము.

కోఁతి:—(తనలో) మంచిసమయము వచ్చినది! మోసపుచ్చి యీ రొట్టెముక్కను మ్రింగివేసెదను. (పైకి.)

ఆ. వె. రొట్టెముక్క కొఱకు ఇట్టుల మీరలు
తగవు లాడవలదు దానిపనిని
నేను తీర్పఁగలను గాన నా రొట్టె నా
చేతి కిచ్చి వినుఁడు చెప్పినట్లు.

మొదటిపిల్లి:—సరే! అటులనే వినెదము. మాతగవు తీర్పుము.

రెండవపిల్లి:—రొట్టెముక్క నీయిష్టము వచ్చినట్లు పంచుము. (ఇచ్చును.)

కోఁతి:—ఇష్టము వచ్చినట్లుకాదు. ఇదిగో! తాసు. తూఁచెదను చూఁడుడు. (త్రాసులో రెండువైపులఁ బెట్టును.)

రెండవపిల్లి:—కుడివైపుముక్క పెద్దదయినది.

కోఁతి:—దానికేమిలే సరిచేసెదను (పెద్ద ముక్కలో సగము తినును)

రెండవపిల్లి:—అయ్యో! ఎడమవైపుముక్క బరువైనది!

కోఁతి:—ఈముక్కను తగ్గించెదను. (ఇందులో సగముతినును.)

రెండవపిల్లి:—తూనిక కుదురునటుగా లేదు.

కోఁతి:—అవును నిజమే. ఈపని సాగదు. (అని రెండుముక్కలు తినివేయును)

మొదటిపిల్లి:—మాకేదీ? రొట్టె?

కోఁతి:—కుదురనప్పుడు ఏమిచేయఁగలము. ఇటువంటి ఆహారము నెన్నఁడును దెచ్చికొనకుడు. లేచి పొండు (అని వెళ్ళిపోవును.)

రెండవపిల్లి:—ఛీ! మన తెలివితక్కువ ఎంతవఱకుఁదెచ్చినది.

తే. గీ. కష్టనిష్ఠురములఁబడి కాంచినట్టి
రొట్టెముక్కను కోఁతికిఁ బెట్టి మనము
చేతులాడించుకొనుచును జింతతోడఁ
బోవవలసెను చూచితే పోరు ఫలము.

మొదటిపిల్లి:—మనబుద్ధితక్కువకు మనమే చెంపలువాయించుకొనవలెను. (రెండుపిల్లులుపోవును.)

8. కీర్తన.

పోరునష్టము పొందులాభము పుడమిలో నెవ్వారికిన్
లేరులాభముఁ బొందువారలు పోరుగాంచినపిమ్మటన్ ॥పోరు॥
కోరి రొట్టెను దెచ్చికొన్నను కుడువగల్గెనె పిల్లులున్
తారుమారుగ గోఁతిమెక్కఁగ దారిబట్టుట చూడమే ॥పోరు॥

9. లెక్కలు.

1. తాసులో రెండు రొట్టెముక్క లున్నవి. ఒకటి పదితులములు. ఇంకొకటి 3 తులములు. రెండును గలసి యెన్ని తులములు?
2. పదితులములముక్కలో నాలుగుతులములు కొఱికెను. మిగిలిన దెన్నితులములు?
3. తాసుపళ్ళెమునకు 3 త్రాళ్ళు కట్టబడియున్నవి. రెండుపళ్ళెముల కెన్నిత్రాళ్లు?
4. తొమ్మిదితులముల రొట్టెను మూఁడు సమానపు ముక్కలు చేసిన ఒక్కొక్కముక్క యెన్నితులము లుండును?

# 6. ఏనుఁగు - మొసలి.

## 1. కథ.



ఒక అడవిలోఁ బెద్ద చెఱువు ఉన్నది. ఆ చెఱువులో నొక మొసలి యుండెను. ఆచెఱువులోని నీరు త్రాగుటకుఁ గొన్ని యేనుఁగులు వచ్చెను. అందులో నొక యేనుఁగు చాల బలముగలది. అది చెఱువులో దిగి తొండముతో నీళ్ళుపీల్చి చిమ్ముచుండెను. చెఱువంతయుఁ గలియఁ దిరుగుచుండెను.

ఏనుఁగుపాదము మొసలిమీఁదఁ బడెను. మొసలికిఁ జాల కోపము వచ్చినది. అది యేనుఁగుకాలు పట్టుకొనెను. ఏనుఁగు కాలు విదలించెను. మొసలి విడువలేదు. ఏనుఁగు బలముకొద్ది లాగెను. మొసలిని కదిలించలేకపోయెను.

ఇట్లు చాలదినములు పోరాటము జరిగెను. ఏనుఁగునకు ఆహారము లేదు. ఏనుఁగు బలము తగ్గిపోయెను. చివఱకుఁ జేయునది లేక దేవునిఁ బ్రార్థించెను. దేవుఁడు చక్రమునుఁ బంపి మొసలినిఁ జంపెను. ఏనుఁగును రక్షించెను.

## 2. ప్రశ్నలు.

1. మొసలి ఎచ్చటనుండెను?
2. ఏనుఁగు ఏమిచేసినది?
3. మొసలికిఁ గోప మెందుకు వచ్చెను?
4. ఏనుఁగు బల మేల తగ్గిపోయెను?
5. చివఱకు ఏనుఁగు ఏమిచేసినది?
6. దేవుఁడు వచ్చి యేమిచేసెను?

## 3. సామెతలు.

1. ఏనుఁగు బలము :—మిగుల బలముకలది.
2. మొసలి పట్టు :—ఎంతకును విడువనిపట్టు.
3. చెఱువంత విస్తరి :—చాల పెద్ద ఆకు.

4. డ్రాయింగు.

1. ఏనుఁగుకాలు. 2 మొసలినోరు.





5. చేతిపని.

2 ఏనుఁగుకాలు:—మట్టితోఁ జేయవలెను.

2. మొసలినోరు:—అట్టతోఁ గత్తిరించవలెను.

6. వస్తుపాఠము.

1. ఏనుఁగు:—ఇది జంతువులన్నిటిలో మిగుల బలము గలది. దీనిశరీరము చాల పెద్దది. ఏనుఁగు మాంసమును తినదు. ఆకులు, రెల్లు ఉలవలు, సెనగలు, మొదలగు గట్టి ధాన్యములను తినును. తుండము చివఱ సన్నని వ్రేలుండును. దానితో నేలమీఁదినుండి సూదినికూడ ఎత్తగలగు. దీని చెవులు చేటలవలెఁ బెద్దవిగ నుండును. కన్నులు చాల చిన్నవి. మగ యేనుఁగునకు రోకలియంత దంతములు రెండుండును.

2. మొసలి:—మొసలి నీటిలోఁ దిరుగు జంతువు. నీటిలో నున్నపుడు ఎంత పెద్ద జంతువునైనను బట్టుకొనిపోవఁగలదు. నీటివెలుపల దీనిబలము అక్కఱకురాదు. దీనినోరు చాల పెద్దది. నోటిలో వంకఱకోఱలుండును.

## 7. నాటకము.

పెద్దఏనుఁగు:—ఓ ఏనుఁగులారా!

తే. గీ. ఉదయముననుండి అడవిలోఁ జెదరకుండ
తిరిగియుంటిమి, అదిగో! దగ్గఱన చెఱువు
గలదు, దానిలో నీరుఁ ద్రాగఁగవలయు
బోవుదమురండు మనకింకఁ బ్రొద్దులేదు.

చిన్నఏనుఁగులు:—అవును, అది చాల పెద్ద చెఱువు. దీనిలో ఈదులాడవచ్చును. నీరుఁ ద్రాగవచ్చును. ఎండలోఁ దిరిగిన ఆయాస మంతయును దీఱును.

పెద్దఏనుఁగు:—ఏనుఁగులారా! నేను చెఱువులో ఈఁదుచున్నాను. మీలో ఎవరైనను సరే! నన్ను ముట్టుకొనుఁడు. (ఒకదాని వెనుక నొకటి చెఱువులో దుముకును.)

మొసలి:—(తనలో) నేను చాలకాలమునుండి ఈ మడుగులో ఉన్నాను. నేఁడు ఏనుఁగుల గుంపువచ్చి చెఱువును గలఁచివేయుచున్నవి. నాకు నిలుచుటకుఁ దావు లేకున్నది.

తే. గీ. నీటిలోనుండి అవలకు దాటి చనిన
గవ్వకేనియు నేఁ గొఱగాను నిజము
తనదు బలముకన్నను మించు స్థానబలము
కాన నేనుఁగు బట్టెదఁ గదలకుండ.

(పట్టుకొనును.)

పెద్దఏనుఁగు:—నా ముందుకాలును ఏదియో పట్టుకొనినది. తొండముతో గుంజి పాఱవేసెదను. (లాగును.)

చిన్నఏనుఁగులు:—(ఒడ్డున కెక్కి పోవును.)

మొసలి:—అబ్బా! ఈ యేనుఁగునకు ఎంత బలమున్నది! నీటిలో నుండుటచేత నన్ను ఏమియుఁ జేయలేక పోయెను. నేలమీఁద నున్న యెడల ఒక్క నిముసములోఁ జంపివేసియుండును.

పెద్దఏనుఁగు:—ఓహో! ఇది మొసలి. దీనికి స్థానబలమున్నది! ఒడ్డునకు లాగుటకుఁ బ్రయత్నించెదను. (లాగును.)

మొసలి:—ఏనుఁగు మంచి ఉపాయమును ఆలోచించినది. నన్ను ఒడ్డున కీడ్చుచున్నది. నేను దీనిని నీటిలోనికి లాగెదను. (నీటిలోనికి లాగును.)

పెద్దఏనుఁగు:—ఇఁక నా శక్తి చాలదు.

ఆ. వె. మొసలి గెలువలేను ముందుకాలినిఁ బట్టి
యీడ్చుచుండె బెండు నీడ్చినట్లు
ఎంతొఁ బరువుగల్గు ఇనుముకూడను నీటి
లోనఁ దేలికగును పూని యీడ్వ.

మొసలి;—ఈ యేనుఁగు నాకు లొంగిపోయినది. దీనిని నీటి యడుగునకుఁ దీసికొని పోయెదను. దీని మాంసము నాకు జాలదినములు ఆహారమగును. (లాగును.)

పెద్దఏనుఁగు:- ఇఁక నేను బ్రిదుకుట కల్ల. ఇఁక నన్ను దేవుఁడే రక్షింపవలెను. శ్రీహరిని( బ్రార్థించెదను.

ఆ. వె. బలము తూలిపోయెఁ బ్రాణముల్ నిలువవు
మొసలి నీటిలోన ముంచుచుండె
నీవె దిక్కు నాకుఁ బ్రోవవే శ్రీహరీ!
వేఁడికొనెద భక్తితోడ నిన్ను.

శ్రీహరి:—ఎవరో భక్తులు నన్నుఁ బిలుచుచున్నారు. (ఆలోచించి) మడుగులోనుండి ఏనుఁగు మొఱలు పెట్టుకొనుచున్నది. పాపము మొసలి ఏనుఁగును జంపుచున్నది. ఏనుఁగునకు నాయందు జాలభక్తిగలదు. రక్షించెదను.

తే. గీ. చక్రమా! పోయి మొసలిని జంపివేసి
నన్ను దైన్యముతో వేఁడుచున్నయట్టి
ఏనుఁగును రక్షణముసేయు మిపుడుపొమ్ము
తడవుచేసిన బ్రాణముల్ దక్కవిఁకను.

పెద్దఏనుఁగు:—అమ్మా! దయామయుఁడగు శ్రీహరి నన్ను బ్రతికించినాఁడు. ఇదిగో! చక్రమువచ్చి మొసలిని రెండు తుండెములు చేసినది. ఇఁక ఒడ్డునకుఁబోయిఁబ్రదికెదను. ఇఁక ఎప్పుడును శ్రీహరిని ధ్యానించుకొనెదను.

(పోవును.)

## 8. కీర్తన.

కసవుమేసి జలంబుఁ ద్రావఁగ - గహనమందలి చెఱువులో
ముసలి యేనుఁగు కాలిఁ గ్రిందను - మకరి నింబడఁ ద్రొక్కి తా
మొసలినోటికిఁ జిక్కి యాకరి - మొఱలు వెట్టినఁ బ్రేమతో
బిసరుహాక్షుఁడు పంపెఁ జక్రము - బీచమడఁపఁగ నక్రమున్.

## 9. లెక్కలు.

1. ఏనుఁగునకు 4 కాళ్ళు కాలికి 5 గోళ్లుండును. నాలుగు కాళ్ళకు గోళ్ళెన్ని?

2. మొసలికి పైపండ్లు 6. క్రిందిపండ్లు నాలుగు. ఏనుఁగును బట్టినపుడు 2 పండ్లు విఱిగినవి. ఇఁక నోటిలో నెన్ని పండ్లున్నవి ?

3. బందరునుండి బెజవాడకు 42 మైళ్ళు దూరము. ఏనుఁగు గంటకు 14 మైళ్ళు నడచును. బందరునుండి బెజవాడకు ఎన్నిగంటలలోఁ జేరఁగలదు ?

4. ఏనుఁగు వీఁపు మీఁద 16 మళ్ళు వెండి, 2 మళ్ళు బంగారము, 1 మణుగు రాఁగి, 1 అర్ధమ[illegible] ఇనుము, అర్ధమణుఁగు సీసము వేయఁబడినది. దా[illegible]పిన మొత్తము బరువెంత ?

---